08:00
→ నిద్ర లేవడం దగ్గరే యుద్ధం ప్రారంభం. 5:00 కి Alarm పెట్టుకోవటం. అది కీ, కీ అంటుంది దాని నోరు నొక్కేసి నిద్ర పోవటం. నిద్రలేవాల అనే సంకల్పము మనలోనే ఉంది, ఇంకాసేపు పడుకోవాలి అనే మనలోనే ఉంది. ఈ రెండింటికీ మధ్యన యుద్ధం.

→ జీవితాంతం ఈ యుద్ధము నిత్యము జరుగుతూనే ఉంటుంది. ఈ యుద్ధం లో ధర్మానికి సంబంధించిన పక్షం, అధర్మానికి సంబంధించిన పక్షం రెండూ ఉంటాయి. ఎవళ్ళు 100% పరిపూర్ణులు అంటూ ఉండరు. ఈ యుద్ధంలో మనము ఎటువైపు విజయం సాధించాల అనే ప్రశ్న రూపంగా, Implied meaning రూపంగా ఉంది.

→ సంజయ — సంజయః జయతి - అంటే ధర్మము చక్కగా విజయం సాధించే లాగా మనం తీసుకోవాలి అనే ఈ శ్లోకంలో ఒక అంతర్లీనమైన అర్థం మనకి గోచరిస్తూ ఉంటుంది.

——— * ——— * ——— * ———

గీతా భాష్యము.
సంబంధ గ్రంథము

→ ఆయన ఒక ప్రార్థనా శ్లోకాన్ని చేస్తున్నారు. ఈ ప్రార్థనా శ్లోకం ఆయన సొంతది కాదు. ఇది విష్ణు పురాణం లో శ్లోకం. ఆయన ఈ శ్లోకాన్ని అక్కడ పెట్టి దాన్ని ప్రార్థనగా వాడుకుంటున్నారు.

" ఓం నారాయణః పరోవ్యక్తాత్ అండమవ్యక్త సంభవమ్।
అండస్యాంతస్త్విమే లోకాః సప్త ద్వీపా చ మేదినీ॥ "

→ ఈ శ్లోకము వ్యష్టిని సమిష్టితో కలిపే శ్లోకము.
వ్యష్టి అంటే మనిషి, వ్యక్తి, మనిషి ఎక్కడ ఉన్నాడు? భూమండలం మీద ఉన్నాడు, మనిషి - అంటే అక్కడ మనం, చెప్పే సృష్టికి central point భూమండలం. ఎందుకంటే మనం విశ్వం లో ఉన్నాం, విశ్వంలో ఏమేమి ఉన్నాయి, Galaxies, Black holes, etc ఎన్నెన్నో ఉన్నా మనమున్న భూగోళము నుంచి అన్నీ starts. I am the central point

FEBRUARY 2019

| S | M | T | W | T | F | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | • | • | 1 | 2 |
| 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 |
| 24 | 25 | 26 | 27 | 28 | • | • |

Priority ◀ Assignment ◀

→ 5. నేను నివాసం చేసే మేదిని = భూమి.
ఈ భూమి ఎట్టిది? సప్త ద్వీపః = ఏడు ఖండములు కలది
చాలా విశాలమైన వృత్తసదృశం, కేవలం నేను నివాళ్ళ ఆకారంలో
ఈ భూమి one of the లోకం = ప్రాణులు నివాసం చేసే స్థానము.
మిగతా లోకాలు – 7 up → భూః, భువః, సువః, తపః, మహః, సత్యం.
అలాగే – Down → అతల, వితల, సుతల, [illegible] తలాతల, పాతాల etc
→ వేదాంతంలో ఉపనిషత్తుల్లో మూడు లోకాలు అంటారు. భూః, భువః, సువః – అంతే
→ ముల్లోకాలు –
→ అండాకారం – A system is more stable in elliptical than spherical shape. బ్రహ్మాండము
→ ఈ ముల్లోకములు సృష్టము నందు కలవు. ఆ సృష్టము, అండాకారంలో ఉంటుంది కనుక బ్రహ్మాండము అని పేరు పెట్టారు.
→ ఈ అండము ఎక్కడనుంచి పుట్టింది? బ్రహ్మాండము అంటే It is energy, ఈ సృష్టి అంతా కూడా Energy నుంచి వచ్చింది కనుక. The creation is from Energy, Including matter, Matter కూడా condensed energy కాబట్టి. ఈ బ్రహ్మాండము ఆ Universal Power నుంచి వచ్చింది. శక్తి, ఈశ్వరీయ శక్తి, ఆ పరమేశ్వరుని శక్తి, దానికే మాయాశక్తి అని పేరు. ఈ మాయాశక్తి ఎలా ఉంటుంది అంటే
→ మాయాశక్తి నుంచి ఉద్భవించిన అండము ఎలా ఉంటుందో చెప్పగలం కానీ, ఈ అండము దేని నుంచి పుట్టిందో ఆ బీజము దాని గురించి చెప్పలేము. అది కంటికి కనబడదు సూక్ష్మంగా ఉంటుంది.
Eg:- బంగారం, నీరు. etc
→ ఈ జగత్తంతా ఏ మహాశక్తి నుంచి ఆవిర్భవించిందో దానికి ఏ రూపము లేదు. అది ఇంద్రియ గోచరము కాదు. దాన్ని మనస్సుతో ఊహ చేసి ఇలా ఉంటుంది అని చెప్పలేరు. దాని గురించి మీరు వర్ణించటం అలవి కాదు. దానికే "అవ్యక్తము" అని పేరు
→ 6. ఈ అండము అవ్యక్తం సంభవమే. ఆ అవ్యక్తం నుంచి పుట్టింది ఈ బ్రహ్మాండం

Assignment Priority

బలశాలియగు ఉత్తమౌజసుడు, సుభద్ర పుత్రుడగు అభిమన్యుడు,
ద్రౌపది యొక్క పుత్రులగు ఉపపాండవులు కూడ ఉన్నారు.
వీరందరూ గొప్ప ధనుర్ధరులు, మహారథులు, వీరు యుద్ధములో భీమునితో, అర్జునునితో సమానమైన వారు.



6 వ శ్లోకం :

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥

→ యుధామన్యుః - విక్రాంతః = విక్రమము = శత్రువులను వేగంతో దెబ్బతీసే సామర్థ్యము
→ వీర్యవాన్ ఉత్తమౌజ
→ సుభద్ర కొడుకు - అభిమన్యుడు
→ ద్రౌపదేయాశ్చ = ద్రౌపది పుత్రులు - 5 మంది

శ్రీ శంకరాచార్య భాష్యము

→ ప్రస్థాన త్రయము → వేదాంత శాస్త్రంలో పరమ పురుషార్థమైన మోక్షానికి ఆత్మ జ్ఞానము అనే సాధన - ఏదైతే కలదో, ఈ ఆత్మ జ్ఞానమును పొందడానికి ప్రధానమైన గ్రంథములు 3. అవి ప్రస్థాన త్రయము

ప్రస్థానము - It's a kind of express way

→ ఈ మూడింటిని అధ్యయనము చేస్తే, వేదాంత శాస్త్రం యొక్క subject matter ఆత్మ జ్ఞానము అంతా తెలుస్తుంది

→ ① ఉపనిషత్ ప్రస్థానము - 10 ఉపనిషత్తులు with shankara bhashya తో

② బ్రహ్మ సూత్ర ప్రస్థానము - సూత్రం - చాలా గంభీరమైన అర్థానికి చాలా తక్కువ పదాలతో చెప్పేది సూత్రము
వేద వ్యాసుడు ఇచ్చిన సూత్రాలకి - శంకరాచార్య భాష్యము

③ గీతా భాష్యము - ఉపనిషత్తుల సారము

→ గీత ప్రార్థన - పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం వ్యాసేన గ్రథితాం పురాణ మునినా మధ్యే మహాభారతం.

① ఉపనిషత్తుల విస్తరణ - బ్రహ్మ సూత్రాలు, సారం - గీత
మూల గ్రంథం - ఉపనిషత్తులు

→ అయితే మాయాశక్తి that is the Ultimate? No.
మాయాశక్తి is not the ultimate, శక్తి అంటే శక్తిమాన్ is ultimate. Eg: నృత్యము, నర్తకి - Dance - Dancing person

*→ మాయా శక్తి, కలిగినటువంటి పరమేశ్వరుడు శక్తిని తన ఆధీనంలో ఉంచి, దాని నుండి స్వతంత్రంగా వ్యవహరిస్తు, దాని లోపల జగత్తుని సృష్టిస్తాడు, జగత్తుని నిలబెడతాడు, కాని ఆ శక్తిని తన స్వరూపంలో భాగంగా ఇముడ్చుకొని ఉన్నటువంటి ఏ పరమేశ్వరుడు ఉన్నాడో ఆయన "అవ్యక్తాత్ పరః" - మాయా శక్తి కంటే కూడా ఉత్కృష్టుడు, శ్రేష్ఠుడు. దానికి ఆశ్రయమైనవాడు

→ ఆయనకే నారాయణుడని పేరు. ఆ పేరు ఎలా వచ్చింది అంటే నరా ఏవ నారాః, నరాః అంటే జీవులు, ప్రాణులు. ఈ ప్రాణులకు నరాః అనే పేరెందుకొచ్చింది? న రిష్యతి ఇతి. నరః వినాశనము చెందేది కాదు. ఈ చైతన్యం ఉండే consciousness అది వినాశనము చెందేది కాదు. Matter కి వినాశం లేదు, Energy కి వినాశనము లేదు. ఇంక Consciousness కి వినాశనము ఎక్కడ నుంచి వస్తుంది? వినాశనము అంటే నామ రూపాలకి ఉంటుంది కాని ఆత్మకి ఉండదు. ఆ చేతనమైన పురుషుడు → నరః, వినాశనము లేనివాడు.

→ నరః ఏవ నారః = నరుడికే నారః అని పేరు. నారః అయనం యస్య నారాయణః → ఈ సకల ప్రాణుల హృదయంలో ఆత్మ చైతన్యం రూపంగా నివాసం చేసేవాడు కనుక. జగన్నివాసః

→ ఆ నారాయణుడే మాయా శక్తి కంటే అధిపుడు (అధీశ్వరుడు), అవ్యక్తం కంటే అధీశ్వరుడు.
అండమవ్యక్త సంభవం - ఆ మాయాశక్తి నుంచి బ్రహ్మాండము పుట్టినది
అండస్యాంతస్త్విమే లోకాః - ఆ బ్రహ్మాండం లో ముల్లోకములు గలవు
సప్తద్వీపా చ మేదినీ = ఆ మాయాండంలో భూమండలం కలదు.
ఆ భూమండలము నందు మనము ఉన్నాము

→ ఈ విధంగా మనకి నారాయణునికి మధ్య Bridge ని నిర్మాణం చేసి సమిష్టి లో వ్యష్టి అంతర్గతమై ఉండును అని స్మరించుకుని నమస్కారం ఏమి లేదు, స్మరణ చేయవలెను, అలా భావన చేయుటయే ప్రార్థన.

సంబంధ గ్రంథము : ఉపోద్ఘాత భాష్యము = Introductory Bhashya
అసలు మనం Gita ఎందుకు చదువుకోవాలి

—పుట్టుక, నాశనము జగత్తుకు ఉన్నాయి, కానీ జగత్కారణమైన ఈశ్వరునకు పుట్టుక, నాశనము లేవు అందుకు ఈశ్వరున్ని పర: నారాయణా: పర:

అవ్యక్తం - unmanifest - కార్య - Manifest కారణము - un

*→ ఈ మొత్తం సృష్టిలో మనకి సంబంధం ఈశ్వరునితో ఉంది.
(2) మనం ఈశ్వరుని నుంచి వచ్చాం, ఈశ్వరుని లోకి వెళ్తాం, మనం ఈశ్వరునికి చెందిన వాళ్ళం. కానీ మనం ఏమనుకుంటామంటే మనం ఈ వీళ్ళకి చెందిన " , వీళ్ళు మనవాళ్ళు అనుకుంటాం కానీ వైదికమైన సత్యం ఏంటంటే మనం ఈ జగత్తులోనికి వచ్చినపుడు ఎలా వచ్చాం Utterly Alone, జగత్తులోంచి ఎలా వెళ్ళిపోతాం? ఏకాకిగా వెళ్ళిపోతాం. మనదంటూ ఈ జగత్తులో ఏముంది? ఏమీ లేదు. మధ్యలో కొంత సమయము ఉంటాం when compared to సృష్టి, కొండలు etc. మనం ఇక్కడ నివసించేది చాలా తక్కువ కాలం. దీనికంటే మనం ఎక్కడ నుండి వచ్చాం, ఎక్కడికి వెళ్తాం అన్నదానికి ఎక్కువ Importance.

*→ మనిషి తన గురించి తాను తన చుట్టూ ఉండే సంబంధాలని బట్టి
(3) తూకం వేసుకుంటుంటాడు, నేను అనగానే తన చుట్టూ ఉండే పరిస్థితులను బట్టి నేను కి నిర్వచనం చేయటానికి Try చేస్తాడు, కాని ఇవి ఉండకముందు, పోయిన తరువాత కూడా నేను ఉంటుంది. ఈ నేను గురించి వృత్తాంతం మనకి ఎవరికీ తెలియదని చెప్పాలి. దాని గురించి తెలుసుకొనేందుకు వేదాంత శాస్త్ర అధ్యయనము చేయాలి

→ ఈ విధంగా జీవునికి, ఈశ్వరునికి ఉండే నిత్య సంబంధాన్ని చూపించటం కోసం ఈ ప్రార్థనా శ్లోకం

Eg ÷ Government company Appointment

భాష్యం :-

1) స భగవాన్ సృష్ట్వేదం జగత్ తస్య చ స్థితిం చికీర్షుః మరీచ్యాదీన్ అగ్రే సృష్ట్వా ప్రజాపతీన్ ప్రవృత్తి లక్షణం ధర్మం గ్రాహయామాస వేదోక్తం.

* → ఇక్కడ శంకర భగవత్పాదులు సృష్టి ప్రక్రియను ఒక దాన్ని ఉదహరిస్తున్నారు. వేదాంత శాస్త్రంలో తాత్పర్యం (Intent) ఏమిటంటే. సృష్టి ఇలా జరిగింది అని చెప్పటం మందు తాత్పర్యం ఏమి లేదు. Intent అన్న, నేను, ఈశ్వరునికి సంబంధము, ఈశ్వరుడు ఉపదేశించిన ధర్మాన్ని నేను పాటించవలసిన అన్న ఉపదేశమే ఇక్కడ తాత్పర్యం.

→ సృష్టి ఎలా జరిగింది అన్నది అనవసరం, b/n Eshwara & Me what are the different steps it doesn't matter, Only this much matters. I am connected to Eshwara through a few steps. Steps ఎన్ని ఉన్నాయి, లేవా. ఎన్ని ఎలాంటి ఉన్నా, లేకున్నా. It doesn't matter, steps యొక్క Nature doesn't matter, Only this much matters i.e. here I am, Eshwara is the cause of the universe, I am connected to eshwara. & there are no Intermediates. వేదాంత శాస్త్రంలో, హిందు ధర్మంలో Intermediary ఎవరూ ఉండరు, కొన్ని సందర్భాల్లో some people present themself as intermediary, Agent లాగ

* → Guru is an Intermediary - No - If any guru presents himself as intermediary then that is the mistake. దాని వలన ఏమవుతుందంటే student కి ఏ freedom రాదు. He depends upon the guru like. ప్రతీ దానికి ఓ బానిసలా ఉంటాడు, ఎంటి? నాకు పూర్తి Independence వద్దు. ఎందుకంటే పూర్తి Independence అంటే fear, నా పైన Internal - Auditor, ఆధ్యాత్మ - గురువు, స్వామీజి
Insecure ←

* → This is the weakness, దీని వల్ల ఆ పరాధీనత, ఇతరుల పై ఆధారపడి ఉంటాము, That depending nature ante that is lack of freedom.

→ శిష్యులు గురువు గారు - ఇందులో కూడా Depending nature వస్తుంది - Eg. నా 5000 వేల మంది శిష్యులు, or celebrities శిష్యులు. - It is a bondage for both teacher as well as student

FEBRUARY 2019

| S | M | T | W | T | F | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | • | • | 1 | 2 |
| 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 |
| 24 | 25 | 26 | 27 | 28 | • | • |

Priority

Assignment

* (5) → సత్యాన్ని శిష్యుడు ఎవరంత తానుగా దర్శించవలసిందే, ఆ సత్యాన్ని దర్శించుటలో ఆచార్యుడు సహకరిస్తాడు. ఎలాగంటే Like Sign Board - ఎవరికి వారే సత్యాన్ని దర్శించవలసి ఉంటుంది కాబట్టి there is a direct relation b/n Eshwara & Me

Eg ÷ ఉద్ధవుడు, శ్రీకృష్ణుడు

→ ఆ సంబంధాన్ని అవగాహన చేసుకోవటంలో కొన్ని Intermediates unte ఆ ప్రక్రియనే సృష్టి ప్రక్రియ. One end ఈశ్వరుడు Another end మనము. సృష్టి ప్రక్రియ బోధిస్తూ చాలా బోధనలు చెప్పుతాయి. తాత్పర్యం మాత్రం సంబంధాన్ని చెప్పుటలోనే ఉంది

Eg ÷ Hyd to Vijayawada via...

→ మహాభారతం పురాణ లక్షణాలు ఉండబట్టి, పురాణ సృష్టి ప్రక్రియలో ఉండే లక్షణాలే కనపడతాయి

Eg- తైత్తిరీయం లో - సృష్టి ప్రక్రియ
పరమేశ్వరుడు - శుద్ధ చైతన్య స్వరూపుడు -
Space time frame work - Energy - gas -
Impersonal గా ఉంటుంది. Where as పురాణాలలో personalized గా ఉంటుంది. Eg. ఆకాశ - ఆకాశ మహారాజు etc

→ సహ: భగవాన్ = ఆ పరమేశ్వరుడు.
ఇదం సృష్ట్వా - ఈ జగత్తును సృష్టించాడు తో మొదలు పెడుతున్నారు

Assignment
Priority

| JANUARY 2019 | | | | | | |
|---|---|---|---|---|---|---|
| M | T | W | T | F | S | S |
| • | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | 31 | • | • | • |

▷ పరిస్థితులు ఎలా ఉన్నా నా మనస్సుని నేను స్థిరం చేసుకోని వాటిలో
అలవాటు చేసుకొని సాధన చేస్తాను అనే Attitude మనకు అలవాటు
చేసుకోవాలి

▷ అటుంకాలు - రానివ్వ కూడదు. Vedanta class - first priority
పెళ్ళిళ్ళు, పేరంటాలు, clubs, సినిమాలు ఇవ్వన్ని అనర్థాలు
పెళ్ళికి వెళ్ళటం తప్పుకాదు, class మానేసి వెళ్ళటం తప్పు
సినిమాకి " " " " " "
పెళ్ళికి వెళ్ళటం తప్పు, అనవసరమా అంటే తప్పుతోంది కాదు కానీ అనవసరం

▷ Priorities లో అధ్యయనము that is the first priority
అలాగే మన Spiritual dicipline ఉంటుంది రోజూ పూజ చేసుకోవటం,
జపం చేసుకోవటం, ధ్యానం వాటికి first priority, అప్పుడప్పుడు
skip చేస్తే అది అపరాధము కాదు ప్రమాదము కాదు. కానీ Dicipline
maintain చేస్తే మనకి ఉపయోగము. మన inner growth, అంతరంగం
లో ఒక శుద్ధి నిర్మాణం అవుతుంది, Tention లేకుండా ఉంటుంది
ఒక ప్రసన్నత ఏర్పడుతుంది

→

## శ్రీ శంకరాచార్య భాష్యము

→ భగవానునికి మనకి Direct కలిపేది ధర్మము.
సర్వ జగత్కారణము ఐన భగవానుడు, ఈ జగత్తుని సృష్టించి
Manifestation - సృష్టి,
సృష్టించిన జగత్తుని పాలించేవాడు కూడా భగవంతుడే. దానికోసం,
[illegible]. It's not like that

→ నిలబెట్టటం - చక్రవర్తి - చేయగోరి ఆయన ఏం చేసాడు?
there was some consious being who was my great, great
grand father

→ భగవానుడు - first person. - ఆయన తరువాత Generation
ప్రజాపతులు - 1 మొదటివాడు మరీచి

* → భగవంతుడు అంటే శక్తి స్వరూపుడైన పురుషుడు అంటారు
"హిరణ్య గర్భుడు" అంటారు, తేజోమయుడు
హిరణ్యం అంటే తేజస్సు. శక్తి స్వరూపుడైన భగవంతుడి
నుంచి ఉద్భవించిన మొదటి ప్రజాపతి ఆయనకూడ సృష్టించాడు
మరీచి అంటే - కిరణము అనే అర్థం మరీచికి వచ్చింది.

08:00 09:00 10:00 11:00 12:00 Lunch 13:00 14:00 15:00 16:00 17:00 18:00 Eve.
Assignment Priority
FEBRUARY 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | • | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | • | • | • |

→ ఆ హిరణ్య గర్భుడు సూర్యుడు అయితే మరీచి స్థానంలో కిరణములు ఉంటాయి. అదే అర్థం కూడా దానికి - Metaphor

→ ఈ విశ్వంలో ఉన్న పరమేశ్వరుని శక్తి నుండే ఈ నక్షత్రాలు వెలువడుతాయి, ఆ నక్షత్రాలలో ఒక నక్షత్రం సూర్యుడు, ఆ సూర్యుని నుంచే ఈ Life అంతా వచ్చింది. Therefore మనకి great great grand father హిరణ్యగర్భుడు అవుతాడు అయితే మధ్యలో సూర్యుడు, మరీచి మధ్యలో ఉంటారు

→ మరీచిమాన్ అనే పేరు సూర్యునికి ఉంది

→ ఈ మరీచి మరియు ప్రజాపతులను సృష్టించి వారికి ~~ధ~~ ధర్మాన్ని బోధించాడు (పట్టించాడు - గ్రహింపయామాస) - (గ్రహ - గ్రహయామాస) లను ~~పు~~ పట్టుకోవటమే కాకుండా వాళ్ళతో కూడా పట్టించాడు

→ ధర్మాన్ని పట్టుకోవాలి. అప్పుడే అది మనల్ని పట్టుకుంటుంది.
"ధర్మో రక్షతి రక్షితః"
ధరతీ ఇతి ధర్మః = ఒక మనిషి మనిషిగా జీవించి, జీవిత లక్ష్యాన్ని చేరుకోవటానికి ఉపయోగపడేదే ధర్మం.

→ ఎటువంటిది ధర్మం? ధర్మము రెండు రకాలు
① ప్రవృత్తి లక్షణం ② నివృత్తి లక్షణం.
↳ ముందుకు అడుగు వేసి ఒక వ్యక్తి చేయాలి
పనుల్ను మానివేసి వెనుకకు తగ్గుట - అదే ధర్మమే

→ జీవిత సంగ్రామములో ఒకప్పుడు ధైర్యంగా ముందుకు అడుగువేసి సాగిపోవాలి. అదే ధర్మమే

→ ఒకప్పుడు ముందుకు వేద్దామనుకున్న అడుగు మానివేసి, వెనక్కి తగ్గి calm గా ఉండిపోవాలి. అది కూడా ధర్మం - నివృత్తి.

→ యవ్వనంలో ఒక అమ్మాయిని వివాహమాడి, సంతానాన్ని పొంది, వాళ్ళని జీవితంలో పైకి తీసుకొచ్చి, డబ్బు సంపాదించి, ఇల్లు, వాకిళ్ళు కట్టి, కారు అవి ఇవి కొని, దానాలు, ధర్మాలు చేయటం ఇవన్నీ ధర్మమే

→ ఒక సందర్భంలో తరువాత వయసొచ్చాక సన్యాసి, చిన్న దేవాలయం, ఆత్మ విచారం చేసుకుంటూ కూర్చోవడం, శమ-దమాదులు
శమ = మనో నిగ్రహము, వెనకకు లాగుట, మనసును లౌకిక వ్యవహారాలకి withdraw చేసేయటం - ధర్మం
దమ = ఇంద్రియములను భోగముల నుండి వెనుకకు లాగుట

—

→ రెండు రకముల ధర్మం జగత్తుకి అవసరం. ఈ ధర్మాన్ని ఎవరు నిర్దేశిస్తారు - భగవంతుడే నిర్దేశిస్తాడు ఎందుకు. సృష్టించింది ఆయనే పాలించేది ఆయనే

* → Negitive Attitude - ధర్మం లేదు ఓ ఇప్పుడు అసలు, ఔర రకమైన frustration నుండి అంటారు. దాని నుండి బయటకు వచ్చేయాలి కొన్ని అంశాలలో మంచి points అప్పుడు ఉంటాయి, కొన్ని అంశాలలో మంచి points ఇప్పుడు ఉంటాయి Eg:- భగవద్గీత. Reading

→ ధర్మము ఉండబట్టే సమాజము నడుస్తుంది, సుఖః, దుఃఖాలు రెండూ ఉంటాయి.

→ ధర్మము అనేది జగత్తు యొక్క స్థితికి మూలం, దాన్ని నిలబెట్టేలా చేసేది భగవంతునిదే. అందుకే మరీచి మొ॥ ప్రజాపతులను సృష్టించి ధర్మాన్ని నేర్పినాడు

→ ధర్మం బ్రహ్మమీమాంస వేదోక్తం = వేదోక్తం ధర్మం బ్రహ్మమీమాంస
ధర్మం ఎక్కడ నుండి వచ్చింది.? వేదముల నుండి వచ్చింది
భగవంతునికి వేదాలు ఎక్కడ నుండి వచ్చాయి? ఆయన హృదయంలో జ్ఞానము రూపంగా వేదములు ఉన్నాయి. వేదము అంటే జ్ఞానము

→ జ్ఞానము కి పుట్టుక ఉండదు - Eg:- భగవంతుడు, సృష్టి జ్ఞానము

→ Knowledge is not created, it is only discovered
Eg:- Newton's Law of Gravitation

→ Symbolic - పరమేశ్వరుడు జగత్తుని సృష్టిస్తూనే దానితో భాగంగానే ~~[illegible]~~ ధర్మాన్ని కూడా సృష్టించి ఆ ధర్మాన్ని పాటించే మనుషులు కూడా సృష్టింపబడతారు. అప్పుడే సృష్టి నిలబడుతుంది. లేకపోతే సృష్టి నిలబడదు.

→ ప్రవృత్తి ధర్మం ఎవరికి బోధించాడో వాళ్ళకే నివృత్తి ధర్మం బోధించడం కుదరదు.
↳ ఏక పురుషుడు ఏక కాలంలో ప్రవృత్తి, నివృత్తి రెండూ కలిపి ఆచరించటం సంభవం కాదు. ప్రవృత్తి అంటే ముందుకు అడుగు వేస్తున్నారంటే ఉపసంహారం లేదన్నమాట.

Assignment
Priority

FEBRUARY 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | • | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | • | • | • |

* ప్రవృత్తి ఉంటే నివృత్తి ఉండదు, నివృత్తి ఉంటే
* ప్రవృత్తి ఉండదు, వివేకం అంటారు దీన్ని. కొందరు ఏం చేస్తారంటే మొత్తాన్ని కలగాపులగం చేసి (గా పెడతారు) అంటారు - వివేకాన్ని Develop చేయరు
Ante confusing

→ వివేక పూర్ణంగా ఉంటుంది భగవద్గీత యొక్క బోధ.
ఏక కాలంలో ఏక పురుషుడినే

2వ ప్రవాహం

② తత: అపరాంశ్చ సనక సనందనాదీన్ ఉత్పాద్య నివృత్తి లక్షణం ధర్మం, జ్ఞాన వైరాగ్య లక్షణం గ్రాహయామాస।

→ ప్రవృత్తి ధర్మానికే "కర్మ యోగము" అనిపేరు. నివృత్తి ధర్మాన్ని కూడా భగవానుడు అదే సమయంలో లోకంలో ప్రవేశపెట్టాడు
→ నివృత్తి ధర్మానికి మరీచ్యాదులు కాకుండా సనక, సనందన, సనాతన, సనత్కుమార. ఈ నలుగురు కూడా భగవంతుని అవతారమే. ~~ఇక్కడ~~ వాళ్ళకి నివృత్తి అనే ధర్మాన్ని వాళ్ళ చేత పట్టించినాడు.. వాళ్ళ ద్వారా ఈ లోకంలో ప్రచారం అవుతుంది
→ నివృత్తి లక్షణం అంటే "జ్ఞాన వైరాగ్య లక్షణం."

→ ప్రవృత్తి లో కర్మ ఉంటుంది. కర్మ, కర్మ ఫలం. కామన, ఒక Goal, ఆ Goal ని చేరుకోవడానికి ఒక కర్మ. అది ప్రవృత్తి లక్షణం
→ నివృత్తి లక్షణం అంటే కర్మ ఉండదు ఇక్కడ, జ్ఞానం = తెలుసుకోవడం, వైరాగ్యం. లోకంలో ఉండే భోగం లో నుండి విరక్తి. రక్తి అంటే రాగము, Ambition, Desires - ప్రవృత్తి.
Desirelessness, Non-Attachment (ఆసక్తి లేకుండుట, ఇంద్రియ భోగముల యందు విముఖముగా నుండుట. వాటిని వదిలిపెట్ట శ్రద్ధ లేకుండా, ఉపేక్ష చేసి ఉండుట. - దీన్ని వైరాగ్యము అంటారు
→

MARCH 2019
M T W T F S
• • • • 1 2
4 5 6 7 8 9
11 12 13 14 15 16
18 19 20 21 22 23

Priority    Assignment

"శ్రీ శంకరాచార్య భాష్యము."

→ ధర్మము ద్వివిధము. మనకి ఆ సంగతి అర్థమైంది.
① ప్రవృత్తి ② నివృత్తి

→ Strategical గా step ముందుకు వేస్తే, సందర్భాన్ని బట్టి వెనకకి అడుగు వేస్తే

→ ముందుకి అడుగు వేసి, సాధన సామాగ్రిని సంపాదించి కర్మలను చేసి, వివాహము చేసుకొని కర్మలని చేస్తూ, సంతానాన్ని కని వాళ్ళని పైకి తీసుకొచ్చి పెద్ద చేసి, యజ్ఞ యాగాది క్రతువులని చేసి, తీర్థయాత్రలని చేసి, ఈ విధంగా అలా చేయటం, చేయటం - ధర్మం అది 'ప్రవృత్తి ధర్మం'

→ ఎంతకాలం చేస్తారండీ, దీనికైనా ఒక limit ఉండికదా, శాస్త్రమే limit పెట్టింది. శాస్త్రం ఏమని చెప్పిందంటే ఒక సమయం, ఒక సందర్భానికి వచ్చాక ఆ Point దగ్గర you can drop. అని చెప్తుంది.

→ అయితే Drop చేయాలంటే ఆసక్తి ఉండకూడదు. మనస్సుని యొక్క స్వభావము ఎలా ఉంటుందంటే, మనం ఎలాంటి వాళ్ళమంటే, ఒకళ్ళు బరువు మోస్తున్నాడు. "అయ్యో ఈ బరువు ఎక్కువయింది, నేను మోయలేకపోతున్నాను, చాలా బరువుగా ఉంది, దుఃఖంగా ఉంది మోయలేకపోతున్నాను" అంటాడు. "OK, మోయకు, Drop it" అంటే, ఎలాగ Drop చేస్తామండి Drop చేయటం కష్టం కదా అంటాడు. "Drop చేయటం కష్టం అనిపిస్తుంది, మోయటం కష్టంగా, Drop చేయటం కష్టమేనండి", Meaning less. దానికి కారణం ఏమిటంటే ఆసక్తి అలాంటిది. ఆసక్తి అంటే దానిమీద లోభము, తృష్ణ, Greed, పేరాస. అలాంటివి

→ అది ఏం చేస్తుందంటే తేలికైనదాన్ని కఠినంగాను, కఠినమైనదాన్ని తేలికగాను చూపిస్తుంది. బరువు మోస్తుంటే, అది బరువయ్యి దాని వల్ల నీకు దుఃఖము కలుగుతుంటే, అందులో అది మోసేది వ్యర్థమైన బరువు అనే విషయాన్ని గ్రహిస్తూ ఉన్నప్పుడు, స్పష్టంగా తెలుస్తున్నప్పుడు, త్యాగం చేయాల్సిందేమిటి? ఒకేమారి Drop చేయటమే, చేయటం (మోయటం) మానేయటమే. Drop it over. No No నేను గత పాతికేళ్ళుగా మోస్తున్నాను మీకేమండి చెప్తారు, ఒక్కసారిగా ఎలా Drop చేస్తాం? అంటే OK Carry on.

→ So The Droping is called నివృత్తి, Carrying is called ప్రవృత్తి. కానీ carrying అంటే just మూర్ఖంగా carry చేస్తే, ప్రవృత్తి ధర్మం అవదు

→ అది ప్రవృత్తి ధర్మం అనే Catagory లో పడాలి అంటే కర్మయోగము అని అంటారు. అప్పుడు అంటే దాన్ని Carry చేసే విధానంలో Carry చేయాలి. అలాగే Drop చేసే విధానంలో Drop చేస్తాం

Assignment Priority

FEBRUARY 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | • | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | • | • | • |

ప్రజాపతులకు
→ మరీచి మొదలగు వారికి ప్రవృత్తి ధర్మాన్ని బోధించాడు. ఎందుకంటే
ధర్మం అన్నది ఎవర్నైనా ఒకరు ఆచరిస్తుంటే ఆదర్శంగా ఆదర్శంగా ఉంటుంది గాని
కేవలం పుస్తకాలలో ఉంటే ధర్మం అవదు. ధర్మాన్ని ఆచరించాలి
→ ఆచరసంహిత అంటాం. Eg:- Election Code of Conduct అని ఉంటుంది.
అది అందరూ పాటిస్తేనే దానికి విలువ, అలా రాసి పెట్టుకుంటే వృధాయే ఉంటుంది
→ కనుక ఈ రెండు రకముల ధర్మమును పరమేశ్వరుడు సమాజంలోకి తీసుకురావాల
అంటే పుస్తకం రాసి ఇచ్చేస్తే కుదరదు. ఆ ధర్మాన్ని పాటించే వ్యక్తులను
create చేయాలి. అప్పుడే ఆ ధర్మం సమాజంలో ముందుకు వెళుతుంది.
→ అందుకోసం భగవానుడు ఏం చేశాడంటే సృష్టిలో భాగంగా ప్రవృత్తి ధర్మం
కోసం మరీచి మొదలైన ప్రజాపతులను create చేశాడు. వాళ్ళ ద్వారా
చేసుకొని ముందుకు వెళతారు గృహస్థులుగా ఉంటూ. ఇంక
→ సనక సనందనాదులు వాళ్ళ ఆజన్మ బ్రహ్మచారులు. బ్రహ్మచారులు గానే ఉండిపోతారు
వాళ్ళు శమ, దమాది రూపమైన ధర్మం అంటే నివృత్తి ధర్మాన్ని ఆచరిస్తారు.
→ కం లోకంలో స్పష్టంగా తెలుస్తుంది. ఇదిగో వీళ్ళు ప్రవృత్తి ధర్మ పరాయణులు
వీళ్ళు నివృత్తి ధర్మ వాళ్ళు అని స్పష్టంగా తెలుస్తుంది. clear vision.
భగవద్గీతకి ఆ clarity, Discrimination they are the life of gita

" ద్వివిధోహి వేదోక్తో ధర్మః ప్రవృత్తి లక్షణో నివృత్తిలక్షణః చ ~~జగతః~~

→ వేదము చేత బోధింపబడే ధర్మం రెండు విధములుగా నున్నది. ఒకటి ప్రవృత్తి
లక్షణః, రెండవది నివృత్తి లక్షణః. ఈ లక్షణః అనే పదానికి రూపము అని
అర్థం. ప్రవృత్తి - Activity, నివృత్తి - withdrawal
→ "
జగతః స్థితికారణం ప్రాణినాం సాక్షాద్ అభ్యుదయ నిశ్శ్రేయస హేతుః
యః స ధర్మః బ్రాహ్మణాద్యైః వర్ణిభిః ఆశ్రమిభిః శ్రేయోర్థిభిః
అనుష్ఠీయమానః ॥ "

→ ఈ ధర్మం దాని యొక్క విశిష్టత ఏమిటంటే జగతః స్థితికారణం
ధర్మం అనే పదాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి.
ఈ వాక్యంలో ధర్మానికి చక్కటి నిర్వచనం ఇచ్చారు.
"ధారతీతి ధర్మః" నిలబెట్టునది ధరతే అంటే, నిలబెట్టు చున్నది

Wk. 09 → కనుక ధరః అని పేరు భూమికి. ఎందుకని? సకల
ప్రాణుల్ని నిలబెడుతుంది కనుక ధరా అని పేరు. ఎవరివల్ల నిల్చునే ధరః ~~[illegible]~~
→ "ధారణాత్ ఇతి ధర్మః" - నిలబెట్టేది. దేనిని నిలబెడుతుంది? జగత్
స్థితి కారణం. ఇది చాలా universal vision. సకల ప్రాణుల యొక్క
క్షేమానికి సంబంధించిన దృష్టికోణం. Universal vision జగత్తు అంతటికీ
కూడా నిలబెట్టునది "జగతః స్థితి కారణం". ఈ జగత్తు అంతా కూడా
సుఖ శాంతులతో నిలవాలి. అంటే జగత్ లో ఉండే మనుషులు
ధర్మాన్ని పాటించాలి. పశువులు పాటించాలనే Rule ఏం లేదు. ఎందుకంటే
అవి By instinct (బతికేస్తాయి) వాటి life programmed గా ఉంటుంది
కనుక అవి పుట్టుకతోనే ధర్మం, అధర్మం అని తెలుసుకొని, అధర్మాన్ని
పక్కన పెట్టి ధర్మాన్ని అనుసరించాలి అనే పరిస్థితి పశువులకి లేదు
కేవలం మనుష్యులకే ఉన్నది కాబట్టి ధర్మోపదేశం మనుష్యులకే అవసరం
→ ఎందుకంటే మనిషికి "కర్తుం అకర్తుం అన్యథా కర్తుం" అనే స్వాతంత్ర్యం ఉంది
ఒక పని చేయడానికి గాని, చేయకపోవడానికి గాని లేదా మరోలా చేయడానికి
గానీ choice మనిషికే ఉంది పశువుకు లేదు. ఇప్పుడు కుక్క ఉందనుకోండి
మొరగడానికి గాని, మొరగకుండా ఉండటానికి గాని లేదా మరోలా చేయడానికి గానీ
choice దానికి లేదు. మొరగాలనిపిస్తే మొరుగుతుంది. అది నేనిప్పుడు
మొరిగినందువల్ల, తెల్లవారు జామున అందరికీ భంగం కలుగుతుందేమో ఈ
రకమైన ఆలోచనలు అవేమీ చేయదు. ఇలా మొరిగినట్లైతే అది పద్ధతిగా
ఉండదు అందరి ముందు ఇలా మొరగటం అనేది అలాంటివేమీ అనుకోదు అది
మొరగాలనుకుంటే మొరుగుతుంది. It has no choice where as మనిషి
ఉన్నాడనుకోండి రాత్రి 12:00 కి మనం Band మేళంతో తీస్తే బస్తీ వాళ్ళందరికీ
నిద్ర చెడిపోతుంది అని తెలిసి కూడా ఊరేగింపు తీస్తాడు. He has a choice
he need not do that. But he does it. కాబట్టి ధర్మము అనేది
కేవలం మనుష్యులకే.
→ అయితే అందరు మనుష్యులు ఒకే పనిని చేసుకుంటే సమాజం
నిలబడుతుందా అండి! సమాజం ముందుకి సాగాలి అంటే సమాజంలో
అనేక పనులు సాగాలి. అనేక పనులు జరిగితేనే సమాజం సాగుతుంది. ఇప్పుడు
ఇల్లే ఉందనుకోండి. ఇల్లు చక్కగా ఉండాలి అంటే డబ్బు సంపాదించేవాడు
ఉండాలి. అందరూ డబ్బే సంపాదించారనుకోండి అప్పుడు
Hotel కెళ్ళి భోజనం చేయాలి. కాబట్టి అందరూ డబ్బే
సంపాదించి లేదంటే అందరూ పుస్తకాలే రాసుకొని, అందరూ పుస్తకాలే
చదువుతుంటే ఏమైపోతుంది[illegible]. కాబట్టి కొంతమంది పుస్తకాలు

Assignment | Priority

MARCH 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | • | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |

చదువుకోవాలి, కొంతమంది డబ్బు సంపాదించాలి, కొంతమంది ఇంటి బయట
రక్షణ వ్యవహారం చూడాలి, కొంతమంది ఇట్లా పని కూడా చూసుకోవాలి. ఇంతే
"నాలుగు". ఒక తండ్రికి నలుగురు కొడుకులు. ఒకతను University లో Lecturer
ఇంకొకతను Army లో ఉన్నాడు. మూడో అతను బట్టల వ్యాపారం చేస్తున్నాడు.
నాలుగో అతను factory లో చేస్తున్నాడు. ఇటువంటి సమావేశం It is possible
→ ఒకే ఇంట్లో 4 వర్ణాలు వచ్చేస్తాయి కదా. అలాగే ఒకే భగవంతునికి సంతానము.
జగత్తంతా కూడా భగవంతునికి సంతానమే. so నాలుగు రకాల పనులు చేసుకుంటే
ఆ సమాజం ముందుకు వెళుతుంది

→ బ్రాహ్మణ క్షత్రియ: వర్ణభేది: - so 4 రకముల వ్యవహారాలు సమాజంలో ఉండాలి
ఉంటేనే ఆ సమాజం ముందుకు వెళుతుంది. మనకి Intellectuals ఉండాలి.
Business People ఉండాలి. Protection ఇచ్చేవాళ్ళు ఉండాలి తరువాత
కార్మికులు కూడా మనకు ఉండాలి. 4 రకాలు ఉండాలి. 4 రకాలు లేకపోతే
సమాజము ఎందుకూ కొరగాకుండా పోతుంది Eg: Afganisthan-
→ So ఉపదేశంగా 4 వర్ణాలకి కలిపి చెప్పారు. ఇందులో ఒక పని మంచిది, ఒక పని చెడ్డది అని
ఏమీ లేదు. అన్నీ అవసరమైన పనులే that is one thing.

→ Then "ఆశ్రమభేది:" - ధర్మం ఒకే వ్యక్తి జీవితంలో 4 రకాల ఆశ్రమాలు చెప్పారు.
బ్రహ్మచర్యాశ్రమము - వివాహానికి ముందు మనం చేసే ధర్మం ఎలా ఉండాలి?,
గృహస్థాశ్రమము -, వానప్రస్థము, సన్యాసము. ఒకే వ్యక్తి జీవితంలో 4
different stages, సమాజంలో 4 Different Levels of social activities
4 different types of social Activities ఈ విధంగా ధర్మము, అందరూ
తమ తమ కర్తవ్యాలని చేసుకుంటూపోతే, ఆశ్రమభేది:, వర్ణభేది:, So ఎవళ్ళ
కర్తవ్యాలు వాళ్ళు చేసుకుంటూ ముందుకు

National Defence Day, World Wildlife Day (UN) • 03 Sunday

వెళ్ళినట్టయితే ఆ సమాజం చక్కగా ధర్మబద్ధమైన సమాజంగా ఉంటుంది
→ ధర్మబద్ధమైన సమాజంలో మనం నివసించినప్పుడు అందరికీ Convinenent
గా ఉంటుంది. ఇప్పుడు చెత్త Road మీద పారేయటం అనేది, Gutteing
అనేది మనం చూస్తుంటాం. Municipality వాళ్ళు చెత్తని తీసి collect చేసే
system ఏదో పెడతారు. ఆ system colony లో వాళ్ళందరూ పాటించారనుకోండి
అప్పుడు colony ఎలా ఉంటుంది. clean గా స్వచ్ఛంగా ఉంటుంది
అప్పుడు దానివల్ల ఎవరికి ప్రయోజనం? Colony లో వాళ్ళు అందరికీ
లాభం. Suppose Colony లో వాళ్ళు అందరూ Heigene
పాటించకుండా ఎక్కడపడితే అక్కడ పారేస్తున్నారనుకోండి అప్పుడు Colony
అసహ్యంగా ఉంటుంది దానివల్ల నష్టపోయేదెవరు? అందరూ నష్టపోతారు

APRIL 2019
S M T W T F S
• 1 2 3 4 5 6
7 8 9 10 11 12 13
14 15 16 17 18 19 20
21 22 23 24 25 26 27
28 29 30 • • • •
Priority Assignment

→ కాబట్టి Majority of the people అందరూ తమ తమ పనులను చేసుకుంటే దానివలన అందరికీ క్షేమం. కానీ దురదృష్టవశాత్తూ తమ తమ పనులను చేసేవాళ్ళు 10% కూడా లేకపోతే దానివల్ల ఎవర్కీ ఉపకారం రాదు. అందరికీ కష్టమే. కాబట్టి. Road మీద నడిచేటప్పుడు అందరూ Rules పాటించి, అందరూ Lane ~~traffic~~ Rules పాటిస్తే అందరి Traffic smooth గా నడుస్తుంది. ఎవరూ Rules పాటించక పోతే Traffic jam అయి అందరూ కష్టపడతారు. ఇది మనం గుణపాఠం నేర్చుకోవాలి

→ సమాజంలో ఈ విజ్ఞానం పెరగాలి "మన ధర్మాన్ని మనం పాటించటం ద్వారా, మనలాంటి జీవుల గల్ల సంఘ వ్యవస్థగా ఉంటే అందరికీ క్షేమము అందుచేతనే దానికి ధర్మము అని పేరొచ్చింది. ధరతే ఇతి ధర్మః

→ సమాజ జీవనాన్ని సుఖ:శాంతులతో నింపేది గనుక ధర్మము.

→ సమాజం సుఖ శాంతులతో ఉంటే లాభం ఏమిటి! నామాటకేమిటి అంటే. సమాజం అంటే ఏముంటుంది, మీరూ, నేను కలిస్తేనే సమాజం, సమాజం సుఖంగా ఉండటం, అర్థం ఏమిటి? మీరు సుఖంగా ఉన్నారు, నేను సుఖంగా ఉన్నాను. అప్పుడే సమాజం అవుతుందది ఒక వ్యక్తి యొక్క సుఖం దాంట్లో ఇమిడి ఉన్నది

→ ఏమిటి వ్యక్తి యొక్క సుఖమ్ము ఏమిటి? రెండు రకాల సుఖము "అభ్యుదయ నిశ్రేయస హేతు: య: స: ధర్మ" అభ్యుదయము, నిశ్రేయసము. ఈ పదాలు మంచి పదాలు.

→ అభ్యుదయము, నిశ్రేయసము. Very Important Analysis of ధర్మ: ఇప్పుడు ఒక వ్యక్తి ఉన్నాడు అనుకుంటాడు. నేను జీవితంలో కొంత ధనాన్ని సంపాదించి, కొంత భోగాలు అనుభవించాలనుకుంటున్నాను legal గా, ధర్మ బద్ధంగా ధనాన్ని సంపాదించి భోగాల్ని నేను అనుభవించాలి. దీన్ని అభ్యుదయము అంటారు. తప్పేముంది. fair enough కదా. ఇప్పుడు 25 years young man ఉంటాడు. మంచి ఉద్యోగం సంపాదించి, Degree తెచ్చుకున్నాను, మంచి ఉద్యోగం సంపాదించి, మంచి అందమైన అమ్మాయిని వివాహం చేసుకొని, నేను సుఖ శాంతులతో కాపురం చేసుకుంటాను. I will live my happy life అని అనుకుంటాడు. which is fair enough. అది ధర్మసమ్మతమే. దాంట్లో తప్పేమి లేదు ఆ ధర్మానికి అభ్యుదయము అని పేరు. ఆ పేరు ఎందుకు వచ్చిందంటే అభి ఉదయ ఇంద్రియాలకి అభి ఉదేతి — ఇంద్రియములకు అభిముఖంగా అది ఉదయిస్తుంది కాబట్టి అభ్యుదయము. ఇప్పుడు మనం ధర్మార్థ కామములు. అంటే అర్థము, సంపదకి సంబంధి

Assignment | Priority

MARCH 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | • | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |

కామ - అంటే భోగములను అనుభవిస్తూ ఈ రెండు పనులు
ధర్మ బద్ధంగా చేసుకుంటారు without violating ధర్మ.
→ ధర్మ, అర్థ, కామ - మూడు పురుషార్థాలు మన సిద్ధిస్తాయి. సిద్ధిస్తే
ఏమిటి లాభం? మీరు ఈ జీవితంలో సుఖ శాంతులను పొందుతారు.
సుఖాన్ని పొందుతారు. తరువాత స్వర్గాన్ని కూడా పొంది (మరణించిన తరువాత)
స్వర్గం అంటే ఏమిటి? ఇక్కడ ఉన్న భోగాలే ఇంకా Higher level లో
ఉంటాయి. మీ లైఫ్‌కి భోగాలేగా, స్వర్గం అంటే కూడా భోగమేగదా: స్వర్గానికి
ఇక్కడికి భోగం విషయంలో తేడా ఏం లేదు. ఇక్కడ భోగంతో దుఃఖం
మిళితమై ఉంటుంది, స్వర్గంలో భోగాలలో దుఃఖం ఉండదు అంతే తేడా.
→ Eg:- Dinner in Hotel & స్వర్గం only that much Difference.
→ కాబట్టి ఇది అభ్యుదయము, అది అభ్యుదయము. అంటే తన స్వర్గం, ఇక్కడ
మన lifestyle కి దగ్గరగా ఉన్నదే స్వర్గం ఉంటుంది. ఇక్కడ Dance, Drama ఇవన్నీ
ఉంటే స్వర్గంలో కూడా ఉంటాయి. కొంచెం Higher level లో ఉంటాయి.
→ ఐహిక లోక భోగములు, పరలోక భోగములు రెండూ కూడా అభ్యుదయము
ఇలా మనం స్పష్టంగా తెలుసుకోవాలి. లేకుంటే కొంతమంది ఏమనుకుంటారంటే
ఇహలోకం అంటే Materialism అని, పరలోకం అంటే, స్వర్గం అంటే అదేదో
Spiritualism అని అనుకుంటారు. That is not Spiritualism, that is
Religiosity. The same attitude ఇక్కడ భోగాలు అనుభవించాలి అనుకునే భోగాలు
స్వర్గంలో కూడా continue అవ్వాలి. వీరిద్దరి Inner growth ఏముంటుంది?
→ పూర్వం వాళ్ళేదో ఉన్నారని, అనుభవిస్తుంటారు. వారిద్దరి Inner growth
ఏముంది, కేవలం Dance, Drama, Party కావాలనుకుంటే ఇక్కడ Party
కావాలని అనుకుంటే పైలోకానికి Party కావాలని అనుకున్నారు. ఇద్దరు
Party ఎలా అనుకుంటే కానీ, Basically they are only that much
→ Fair enough you can have it But without violating ధర్మ
అని. ధర్మాన్ని ఉల్లంఘించకూడదు, ధర్మ బద్ధంగా ధనాన్ని సంపాదించుకోవాలి
మీరు ధనాన్ని ధైర్యంగా ఖర్చు పెట్టుకొని భోగాలని అనుభవించవచ్చు. Bank లో
దేనితో దొంగతనం చేసి ఆ డబ్బు ఎప్పుడు కావాలనుకో ధైర్యంగా, సుఖంగా ఖర్చు
పెట్టుకొని Enjoy చేయగలుగుతారా? you can not
→ కాబట్టి ఇహలోకంలో ధనం వల్ల సుఖాన్ని పొందాలి అంటే ధర్మం ఉండాలి దానికి
తోడుగా, same thing పరలోకం మీరు ధర్మం చేసుకుంటే
పరలోకంలో సుఖాన్ని అనుభవిస్తారు. అధర్మం చేస్తే నరకానికి పోతారు
కాబట్టి, ఇక్కడ అభ్యుదయాన్ని, పరలోకంలో కూడా అభ్యుదయాన్ని
సంపాదించి పెట్టేది ధర్మం. అభ్యుదయ హేతుః

→ ఇంక నిశ్శ్రేయస హేతుః, నిశ్శ్రేయసము అంటే ఇంతకంటే గొప్పది మరొకటి లేదు. దానిపేరు నిశ్శ్రేయసము. 'నిర్గతం శ్రేయః యస్మాత్ తత్' నిశ్శ్రేయసం. దీనికంటె గొప్ప హితకరమైనది మరొకటి లేదో దానిపేరు నిశ్శ్రేయసం.

→ ఒక భోగ వస్తువును మనం Market లో కొనాలనుకుంటే వాడేమని ఇస్తాడు, ordinary, Delux & Super delux మీరేమిటి కొనుక్కోవాలనుకుంటారు.? Ice cream లో Super delux తీసుకోవాలి. ordinary తీసుకుంటే కడుపులో పోటు వస్తుంది. అది సరిగా ఉండదు. దాని జోలికి పోవద్దు. ఎప్పటికైనా Quality ఉన్నదే ఉండాలి.

→ సం అభ్యుదయము అంటే ఇక్కడ భోగాలు, స్వర్గంలో భోగాలు రెండూ ఒకటే. Fundamental difference ఏమీ లేదు. రెండింటి యొక్క స్వరూపం ఒకటే. నిశ్శ్రేయసము అంటే ఈ భోగముల వల్ల ఏమిటి లభిస్తుంది? ఆనందం. ఎక్కడినుంచి వస్తుంది ఆనందం. ఎక్కడినుండి వస్తుంది ఈ ఆనందం? భోగాల నుండా? ఈ విచారం చేస్తాడు వేదం.

*→ మామూలుగా మన వేదాంత ప్రచారం. బయటనుండి వస్తున్నట్లు అనిపిస్తుంది
* నిజానికి మీ హృదయం లోనుంచి వస్తుంది. ఇప్పుడు మీరు గమనించండి. ఒక మనిషి వచ్చాడు You feel uncomfortable అతని Presence లో you dont feel good about it అతను వెళ్ళిపోయాడు ఇంకొకడు వచ్చాడు. You are very happy to meet him. ఇప్పుడు first person వచ్చినప్పుడు మీరు uncomfortable గా feel అయ్యారు ఆ Discomfort అది ఎక్కడ ఉంది? మీ లోపలనే ఉంది లేదంటే బయట ఉందా? మీ హృదయంలోనే ఉంది కదా Discomfort అతను వెళ్ళిపోయాడు ఆ Discomfort పోయింది ఈ లోపల మీ Friend మీరు ప్రేమించే వ్యక్తి వచ్చాడు. మీరు చాలా సంతోషపడిపోయారు, Please that pleasure. please అయ్యారు ఆ Pleasure ఆ సంతోషం అది ఎక్కడ ఉంది. హృదయంలో; బయటనించి వచ్చినట్టుగా అనిపిస్తుంది. ఫ్రెండ్ బయటనించి వచ్చాడని మీరు అనుకున్నా But Basical గా సుఖదుఃఖానుభవం ఎక్కడ కలుగుతుంది? హృదయంలోనే కలుగుతుంది.

Assignment Priority

*→ Suppose you know the mechanism to manipulate
* the within. ఏమిటా Mechanism ఏమిటో తెలుసునా? ఈ First వాడు వచ్చి వెళ్ళినా, వాడు ఉన్నప్పుడు కూడా

MARCH 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | • | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |

నేను I manage not to be discomfortable. వాడు తలనొప్పి వస్తే, దాంతో సందేహం ఏమీ లేదు. అయినా కూడా, అతను ఉన్నప్పుడు కూడా నేను I have developed a kind of Immunity so that I can remain comfortable ఇప్పుడు మీరు అతను Discomfort Create చేయగలడా? Create చేయలేడు. కాబట్టి కలత ఎక్కడుంటుంది బయట వాటిలో ఉందా? మీ హృదయంలో ఉందా? మీ హృదయంలో ఉంది దీన్ని కలత అంటారు. ఆ కలతం హృదయంలో ఉంటుంది. So ఆ కలతని పట్టుకోవాలి. కాబట్టి మీరు Local club కి వెళ్లి party చేసుకున్నా కలిగే enjoy ఉంది అది హృదయంలోనే ఉంటుంది. స్వర్గానికి వెళ్లి అక్కడ party లో వచ్చే joy కూడా హృదయంలోనే ఉంది Suppose there is a way. ఏమిటి way ఏమిటో తెలుసునా? హృదయంలో అనంతమైన ఆనందం గంధం. అది మనకి కనిపించకుండా దాగి ఉన్నది. నాకు ఒక secret అర్థమైపోయింది ఆ అనంత ఆనందము నాకు లభించింది I know it. ఇప్పుడు మీరు ఇక్కడ club కి party కి వెళ్ళక్కర్లేదు, అక్కడ స్వర్గానికి Party కి వెళ్ళక్కర్లేదు B/s it is already with you. ఇప్పుడు మీరు Bore వేసుకున్నారు నీళ్లు పడలేదు. అప్పుడు పొద్దున్నే బిందె తీసుకొని ఇక్కడికి, అక్కడికి వెళ్లాలి, నీళ్లు తెచ్చుకోవాలి. ఈలోపు ఇంకోలాగ వచ్చి ఆ Bore ఉండగా మీ ఇంట్లో అడుగున Infinite amount of water is there మీకు తెలియలేదు కేవలం చూస్తున్న సరిగా ఇంకా లోతుగా Bore వేయించాననుకోండి అప్పుడు spring తగిలిందనుకోండి. ఇప్పుడు మీరు పొద్దున్నే ఆ బిందె పట్టుకొని ఇక్కడికి అక్కడికి వెళ్ళక్కర్లేదు. లేకపోతుంటే మరి బిందె పట్టుకొని వెళ్లకపోతే నీళ్లు తెచ్చుకోకపోతే దాహం వేస్తే ఏం చేయాలి, అయ్యో నా ఇంట్లోనే ఉన్నాయంట నీళ్లు, ప్రపంచానికి అంతటికీ ఇవ్వగలిగినన్ని నీళ్లు నా ఇంట్లోనే ఉన్నాయి అది పరిస్థితి

→ దీన్ని ఆత్మానందము అని అంటారు.

→ మీరు ఆ ఆత్మానందమునకి Tap చేయగలిగితే, Ground water కి Tap చేసినట్టుగా, మీరు Local Club కి వెళ్లక్కర్లేదు, celestial club కి వెళ్లక్కర్లేదు. ఎందుకంటే మీకు హృదయంలో ఆత్మ రూపంగా మేము అనంతమైన ఆనంద స్వరూపమైన ఆత్మను పొంది ఉన్నాము. ఇప్పుడు ఈ club కి వెళ్లక్కర్లేదు, ఆ club కి వెళ్లక్కర్లేదు. ప్రపంచంతో అలా cut అయిపోయింది అలా కూర్చున్నట్టునే సరిగా నిర్వృత లక్షణం.

ఇది నిర్వృత లక్షణ ధర్మం. దీనికి నిత్యానందము అని పేరు.

→ ఇప్పుడు మీరు ఒకింది పట్నానికి వెళ్ళాలి అనుకోండి
ఇక్కడికి వెళితే ఒక బిందు, అక్కడికి వెళితే రెండు, దీనికంటే అది ఎక్కువ
ఇక్కడ ఇలా నిలబడాలి, అక్కడ లేటుగా వస్తుంది, ఇలా Comparison
Contrast. మీరు Spring మీద కూర్చుంటున్నారు, ఒక బిందు, రెండు
బిందులా? ఈ Comparison అక్కర అనవసరం. ఒక బిందు దాంట్లోనే ఉంది
రెండు బిందువు దాంట్లోనే ఉన్నాయి.

→ కాబట్టి అన్ని ఆనందములు, విజ్ఞానములు అన్ని కూడా ఆ హృదయం
లోనే ఉన్నాయి. ఈ సత్యాన్ని గుర్తించి, మహాత్ములు "శబ్దాత్ విరమూలు"
శబ్దం అంటే కర్మను బోధించే శబ్దానికి (వేదానికి) శబ్దమనే పేరు. ఆ
కర్మకాండ నుండి విరమించి దానిని Retire అవుతారు. We are done
with it. ఇలాంటి అనుభవమే చేసుకుంటారు we are done with it
దీని పేరు నిఃశ్రేయసము. దీనికే మోక్షము అని పేరు. ఇది ఇప్పుడు ఇక్కడ
లభిస్తుంది. స్వర్గానందము స్వర్గానికి వెళితేనే లభించును; ఆత్మానందము మీరు
ఇప్పుడు, ఇక్కడ ఉన్నది ఉన్నట్లుగా లభిస్తుంది. దీనికంటే వేరేది
మరొకటి లేదు. ఇది నిఃశ్రేయసము.

→ అభ్యుదయము, నిఃశ్రేయసము. ఈ రెండు ధర్మాలు. ఇప్పుడు ఏ కులం
వారికి ఏది ధర్మము అనే మాటే లేదు. ఏ కులం వారైనా అభ్యుదయము
ను పొందవచ్చు లేదా, నిఃశ్రేయసమును పొందవచ్చు. ఏ ఆశ్రమం వారు
ఏది పొందకూడదు? అది కూడా లేదు. ఏ ఆశ్రమం వారైనా అభ్యుదయమును,
నిఃశ్రేయసమును ఆశ్రయించవచ్చును. కానీ సన్న్యాసాశ్రమంలో అభ్యుదయాన్ని
అపేక్షించరాదు, మార్గం లేదు. అభ్యుదయం అంటే డబ్బు, పుణ్యం
సంపాదించాలి. రెండూ ఉండాలి. Local గా ఆనందం పొందాలంటే డబ్బు.
స్వర్గంలో ఆనందం పొందాలంటే పుణ్యం. లోకంలో డబ్బు కోసం ఉద్యోగం, స్వర్గం
లో డబ్బు కోసం యజ్ఞం. యజ్ఞం చేయాలంటే భార్య ఉండాలి కాబట్టి
సన్న్యాసికి కుదరదు, అది కుదరదు ఆ ఆశ్రమం యొక్క
లక్ష్యం అది. కాబట్టి ఒక్క సన్న్యాసాశ్రమం మినహాయిస్తే, అభ్యుదయము,
నిఃశ్రేయస, you can choose. Similarly అభ్యుదయ, నిఃశ్రేయసాన్ని
Different Activities లో ఉన్నవాళ్ళు కూడా పొందవచ్చు.

→ కాబట్టి Sentence కి వేరుగా గమనిస్తే — No Intermediate.

Assignment | Priority

| MARCH 2019 | | | | | | |
|---|---|---|---|---|---|---|
| M | T | W | T | F | S | S |
| • | • | • | • | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |

వారు ఏ వర్ణం వారైనా, ఏ ఆశ్రమం వారైనా He is eligible
But ఒక condition ఏమిటి ఆ condition?
"శ్రేయోర్థిభిః అనుష్ఠీయమానః", మీరు శ్రేయస్సుని కోరి, హేతువును
కోరి అనుష్ఠించవలెను. Eg - Dieting లాంటిది, Dieting నిజంగా చేయాలి అని choose చేసినాక అనుష్ఠించాలి

Wk 12 [illegible] 25వ శ్లోకం :-

" భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి ॥ 25 ॥ "

→ రెండు సేనల మధ్యలో నిలబెట్టమన్నాడు కదా, శ్రీకృష్ణుడు ఇచ్చిన ఆజ్ఞ అలాగే చేసాడు. సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయి - స్థాపయిత్వా.

→ " శ్రీకృష్ణుడు, ఉత్తమమైన ఆ రథమును రెండు సేనల మధ్యలో భీష్ముడు, ద్రోణుల ఎదుట, మహారాజులందరి యెదుట నిలబెట్టి ఇట్లు పలికెను " ఓ కుంతీపుత్ర ఇచట సమావేశమైన ఈ కౌరవులను చూడుము "

→ శ్రీ శంకర భాష్యము

Last class లో ధర్మం యొక్క వాక్యం చెప్పాము. ఇప్పుడు ఈశ్వరుడు సృష్టించేటప్పుడు ధర్మాన్ని సృష్టిస్తాడు కదా. ఈశ్వరుని సృష్టిలో ధర్మమే ఉంటుంది ఈశ్వరుని సృష్టిలో అధర్మం ఉండదు. ఆయన నివృత్తి ధర్మము, ప్రవృత్తి ధర్మము, రెండు రకాల ధర్మాన్ని సృష్టిస్తాడు. ప్రవృత్తి ధర్మం కోసం మరీచి మొదలైన వాళ్ళను సృష్టించాడు నివృత్తి ధర్మం కోసం సనక, సనందనాదుల్ని సృష్టించాడు. ఆయన అధర్మాన్ని సృష్టించడు. ఈశ్వరుడు అధర్మాన్ని ఎందుకు సృష్టిస్తాడు, ఈశ్వరుడు ధర్మాన్ని సృష్టిస్తాడు, అధర్మాన్ని మనం నిర్మాణం చేసుకుంటాం. ఆ మాట చెపుతున్నారు.

" దీర్ఘేణ కాలేన అనుష్ఠాతౄణాం కామోద్భవాత్ హీయమాన వివేకవిజ్ఞాన హేతుకేన అధర్మేణ అభిభూయమానే ధర్మే ప్రవర్ధమానే చ అధర్మే, జగతః స్థితిం పరిపిపాలయిషుః సః ఆదికర్తా నారాయణాఖ్యో విష్ణుః భౌమస్య బ్రహ్మణః బ్రాహ్మణత్వస్య రక్షణార్థం దేవక్యాం వసుదేవాత్ అంశేన కృష్ణః కిల సంబభూవ। "

→ ఈశ్వరుని సృష్టిలో ధర్మమే కాని అధర్మం లేదు, ఈశ్వరుని సృష్టిలో సుఖమే కాని దుఃఖం లేదు. దుఃఖాన్ని జీవుడు సృష్టించుకుంటాడు. ఆ దుఃఖం కోసం అధర్మాన్ని జీవుడు సృష్టించుకుంటాడు జీవుడికి ఎందుకు, ఈ Pressure జీవుడికి ఎక్కడనుండి వచ్చింది? ఈశ్వరుడు సృష్టించని అధర్మాన్ని సృష్టించి, అధర్మానికి picture

MARCH 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| | | | | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |

లోకి పట్టుకొచ్చి, ఆ అధర్మానికి ఫలంగా దుఃఖాన్ని తెచ్చుకొని, దాంతో కష్టపడుతూ ఉండటం, What is the Pressure behind this Attidude of జీవా? What could be the Pressure: Yes the Pressure is కామ: కామ is the Pressure. కోరిక; కామన -Pressure. మరి ఈ కామన అనే Pressure ఎక్కడినుంచి వచ్చింది? వివేక విజ్ఞానము లేకపోవుట చేత వచ్చింది.

→ ఆత్మ స్వరూపము పూర్ణము, ఈ జగత్తులో ఉన్నటువంటి కామ్య పదార్థాలు ఏవైతే, కామ్య వస్తువులు ఏవైతే ఉన్నాయో కోరబడే పదార్థములు, ఇవన్నీ కూడా అనిత్యములు నశ్వరములు. తరువాత వాటిల్లో ఆనందం అనేది లేదు అనేది ఫలం.. ఆత్మ పూర్ణము, ఆనంద నిధానము అనేది విజ్ఞానము. మరి ఈ వివేక విజ్ఞానములు లేవు. అందుచే ఎప్పుడయితే వివేక విజ్ఞానాలు లేవో ఆ లేమి నుంచి, ఆ అభావం నుంచి కామన అనే Pressure పుట్టి, ఆ కామన యొక్క Pressure చేత వాడు అధర్మాన్ని ఆచరించి ఆ అధర్మం వల్ల వచ్చే దుఃఖాన్ని అనుభవిస్తూ ఉంటాడు. ఇది ఈ విధంగా నడుస్తూ ఉంటుంది. కాబట్టి ఈశ్వరుడు అధర్మాన్ని సృష్టించడు. ఈశ్వరుడు ధర్మాన్ని సృష్టిస్తాడు. ధర్మాన్ని సృష్టించి ఆ ధర్మం నడుస్తున్నంత సేపు కొంత కాలం అయేటప్పటికి అది చెడిపోవటం ప్రారంభిస్తుంది.

→ 1947 లో Constitution అని ఒకటి పెట్టారు. ఆ Constitution ప్రకారం మొదట ఏదో కొన్ని రోజులు బాగానే నడిచింది క్రమ క్రమంగా ఆ " [illegible] ఒకడు ఇటు చింపి ఒకడు అటు చింపి పాడు చేసి, ఈ Polititions వంటి



దుస్థితికి తీసుకొచ్చి పెట్టారంటే, ఎంత కష్టాలం చేయాలో అంత చేసారు

Eg:- Party ticket

→ గాంధీగారు పెట్టినప్పుడు అలా లేదు, తరువాత కాలంలో ఈ కాలుష్యం అంతా కూడా వచ్చింది. అలాగే ఇక్కడ అయ్యన మహర్షి ప్రజాపతులను, సనక సనందనాదులను పెట్టినప్పుడు ఈ దోషాలు ఏవీ లేవు. తరువాత చాలా కాలం అయేటప్పటికి, దీర్ఘమైన కాలేన, ఈ ధర్మం అనేది పుస్తకాలలోను Librarys లలోనూ ఉంటుంది అది ధర్మం అనేది అనుష్ఠించటం అనుష్ఠానంలో ఉంటుంది. ఆ కర్మ చేసేవాడి Action లో మళ్ళీ అప్పుడు ఉంటుంది మాట్లాడినపుడు ఆ మాటలో ఉంటుంది ధర్మం. ఆలోచించినప్పుడు ఆ ఆలోచనలో ఆ సంకల్పంలో ధర్మం ఉంటుంది. పని చేసినప్పుడు ఆ పనిలో ధర్మం ఉంటుంది. కాబట్టి "అనుష్ఠాన లక్షణాం"

→ ఈ అనుష్ఠించేవాళ్ళు - అంటే మనసులో సంకల్పం చేయుట, అదేక
అనుష్ఠానము, మానసిక. వాచిక - వాగ్రూపంగా మాట్లాడుట, చేయుట
ఈ మూడు అనుష్ఠానములు. ఈ మూడు levels లో అనుష్ఠానం ఉంటుంది
→ ఈ అనుష్ఠానం చేసేవాళ్ళలో అనుష్ఠానం త్వరగా, అనుష్ఠించేటు వంటి వాళ్ళకి
కామోద్భవాత్ - కామన పుట్టుట వలన. ఏం వీడు ధర్మం చేయాలి. Sudden
గా వీడికి అనిపిస్తుంది, నేను కనక ఈ ధర్మాన్ని చేసినట్లయితే నాకు ఫలానా Loss
వస్తుంది, లేదంటే రావాల్సింది రాదు. ధర్మ ప్రకారం ఈ file ని నేను finalize
చేసేస్తే లంచం రాదు. ఆ లంచం వస్తే, ఏదో Party తో డబ్బో ఖర్చు పెట్టొచ్చు
ఆ లంచం రాకపోతే Loss అని వీడు అనుకుంటాడు.

→ ధర్మం తెలుస్తునే ఉంటుంది. కానీ ఈ కామన యొక్క Pressure వల్ల
వాడు ధర్మాన్ని పక్కన పెట్టేస్తాడు. ధర్మం తెలుస్తుంది అందరికీ. ధర్మం
తెలియని వాడు ఎవడు లేడు. అందరికీ ధర్మం తెలుసు. కానీ the
pressure of Desiring is there అందుచేతనే శాస్త్రంలో మరల గమనించే
ఉంటారు. "కామనలు పెట్టుకోవద్దు" అని చెప్తారు. ఎందుకంటే కామన అనేది
It's a big pressure ఆ Pressure ఏం చేస్తుందంటే మనిషిని ముప్పు
తిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తుంది కామన వద్దు. కోరిక
పెట్టుకోవద్దు. కోరిక లేకపోతే ఇక జీవితం ఏముంటుంది అని ఒకడు
అంటాడు. అవివేకం అంటే అదే అలాగే ఉంటుంది కోరిక లేకపోతే జీవితం
ఏముంది? అంటే, కోరికలు లేకపోతే పూర్ణత్వంలో నీవు ఆనంద స్వరూపుడివై
నిలిచి ఉంటావు. ఇంక అంతకంటే ఏం కావాలి జీవితం. ఈ కోరికలు అన్నీ
ఏం ఉద్ధరిస్తాయి. భోగ్య రోగ భయమే కదా. అంతకంటే మహా భాగ్యం ఏముంది.
అది గ్రహించడానికి చాలా వివేకం కావాలి. అది లేకనే మరి ఈ సమస్య
అంతా కూడాను. కాబట్టి కామోద్భవాత్.

→ ఈ కామము ఎందుకు పుట్టాలి? "హీయమాన వివేక విజ్ఞాన హేతుకేన,
అధర్మేణ". కామం నుంచి అధర్మం పుడుతుంది. దానికి కారణం ఏమిటంటే
వివేక విజ్ఞానము క్షీణించిపోవుటయే కారణము. ఆత్మ యొక్క స్వరూపము పూర్ణము
అని తెలియక పోవటం. బాహ్యం లోని పదార్థముల యందు సుఖము లేక ఆనందము
లేదు, అవి నశ్వరములు, జడములు, చేతనుడనైన నాకు ఆనందాన్ని ఇచ్చే శక్తి
వాటికి లేదు. అనే వివేకం లేకపోవుట చేత, నిత్యానిత్య
వస్తు వివేకం లేకపోవటం, ఆత్మ యొక్క పూర్ణ స్వరూపము తెలియక
పోవటము. ఈ కారణాల చేత వీడు "అధర్మేణ", అధర్మముగా
జీవిస్తూ ఉంటాడు. కామోద్భవాత్, కామన పుట్టింది అధర్మంలోకి

Assignment
Priority
MARCH 2019
M T W T F S S
1 2 3
4 5 6 7 8 9 10
11 12 13 14 15 16 17
18 19 20 21 22 23 24
25 26 27 28 29 30 31

నెట్టేస్తుంది ఇది, ఆ అధర్మము చేత, కామోద్భవాత అంటే కామము
ఉద్భవించుట వలన. (హేతువు) అప్పుడు ఆ కామన ఏం చేస్తుందంటే
వివేక విజ్ఞానాన్ని కప్పివేస్తుంది. క్షీణించిపోతుంది. ఆ Inner Consince
ఆచారం చూడండి దాన్ని నొక్కేస్తుంది, కామన యొక్క Pressure, దాన్ని తల
పైకి ఎత్తనివ్వదు. దాంతోటి అధర్మమా, ఆ వివేక విజ్ఞానం క్షీణించిపోతే
అధర్మం పైకి లేస్తుంది అధర్మమా. ఈ అధర్మం ఏం చేస్తుంది. ధర్మాన్ని
తిరస్కరిస్తుంది - "అభిభవాయమానే ధర్మే".

→ మీకు అధర్మం వచ్చింది అంటే ఆ Level కి ధర్మం చెడిపోతుంది. ధర్మం
చెడిపోకుండగా అధర్మం రాదు. ఓ Corner లో ధర్మం ఉంటుంది, ఓ Corner
లో అధర్మం ఉంటుంది - అలా కాదు. చాలామంది పొరపాటు చేస్తారు. అలా
water tight compartments కింద పెట్టుకునే try చేస్తారు. Public life,
Private life ఇలా ఏవో Logics, Arguments. అధర్మం చేయడానికి Arguments
→ Public life వేరు, Private life వేరు అన్నారు అలాగ, ఎక్కడో అన్నారు
India లోనే ఇలాంటి Arguments వినపడతాయి అనుకోవాలి. Law Abiding societies లో
అన్నారు: Public life clean గా ఉండాల్సిందే, Private life clean గా ఉండాల్సిందే
clean life ఉండాల్సిందే, Public ఏమిటి, Private ఏమిటి. అలాగ రెండు categories ఉండవు.
→ కాబట్టి, లంచం ఎందుకు తీసుకున్నావు అంటే, లంచం తీసుకోలేదు, Party కోసం
తీసుకున్నా అంటాడు. Party కోసం తీసుకోవటం ఏమిటి, లంచం తీసుకుంటే
లంచమే అది - Party కోసం వేరే వ్యక్తి, Government కోసం వేరే వ్యక్తి ఉంటాడా,
ఒకే మనిషి, Party కైనా వాడే, Government కైనా వాడే, వాడే party, వాడే
Government. Government లో Clean గా ఉంటాను. Party దగ్గర
లంచం తీసుకుంటాను అనే Argument wrong Argument it is.
He should not be entertained, what kind of parties are these
parties, I don't like these parties, లంచం తీసుకున్నవాడంటే లోపల బయట
పారేయాలంటే, cleanliness Maintain చేయని Public life లోను.

→ అలాగే అధర్మం పెరిగిపోయింది అంటే, మరి పెరిగిపోతే ఏం చేస్తుంది?
పెద్దవాళ్ళు కూడా తప్పుగా Behave చేసినప్పుడు. కాబట్టి Private life
Public life అని రెండు ఇక్కడ ఉండవు. ఒకే life And that should
be Pure and Clean. ఆ పని చేయకుండా
ఏదు అధర్మాన్ని ఎప్పుడైనా పైకి తీసుకువచ్చారో, ధర్మ
తిరస్కరించబడింది అధర్మమే పెరిగింది అలా అనుకున్నప్పుడు, ఈ
Imbalance ని set right చేయటం కోసం "అంశేన కృష్ణ కిల సంబభూవ"
ఆ నారాయణుడు కృష్ణావతారంగా ఉద్భవించి భగవద్గీతను ఉపదేశించినాడు. ఈ వాక్యాన్ని
మళ్ళీ class లో పూర్తి చేద్దాం.